శ్రీ

శ్రీరస్తు.

చోళసింహ్మపురం

శ్రీలక్ష్మీనృసింహస్వామివారి పేరున

# శ్రీహరినామ సంకీర్తనము.

---

ఇది,

చోళసింహ్మపురం గ్రామంలోనుండు వడమధుర
కరణం వీరాసామిపిళ్లెకుమారుడు మునుగపిళ్ల
రచించిన శ్రీహరినామసంకీర్తనము.

తిరుపతి.

పుండరీకనిలయ ముద్రాక్షరశాలలో

ముద్రింపబడినది.

1913

శ్రీ

# శ్రీ హరినామ సంకీర్తనము.

---

## శ్రీలక్ష్మీ నరసింహస్వామివారి పేరున పద్యము.

ఉ॥ శ్రీరమయంకపీఠమునఁ జెన్నలరారెడువాఁడు భక్తమం
దారుఁడు హేమగర్భప విదారుడతీతుఁ డనంతుఁడాద్యుఁడున్
నారదమౌనివందితుఁడ నాథసురక్షణుఁడాది దేవుఁడున్
ధారుణినారసింహుఁడు ముదంబుఁ దలిర్పగనన్ను బ్రోవుతన్॥

### కీర్తన

ఆదితాళము—పల్లవి.

నారాయణవాసుదేవా - నిన్ను
నమ్మితిమహానుభావా .. శ్రీమన్॥

అనుపల్లవి.

నారాయణహరి - గోవిందాయనినిన్ను
పారాయణముజేయు - భక్తులరక్షించు నారా॥

చరణములు.

అచ్యుతనందనా - ఆపత్ జనార్ధనా
ముచుకుందవరదనా - మురవినాశనా। నారా।

లక్ష్మీసమేతా - సం - రక్షకనాదా
పక్షముతోనన్ను పాలించరాధా శ్రీమన్ నారా॥
శ్రీరఘునాదా - సీతాసమేతా
వారణమునుగదా - వరదుడై బ్రోవలేదా నారా॥
ఘటికాద్రిపురనివాసా - గాంభీర్యవుల్లాసా
యెటుతాళుదుయీశా - యేమందుజెగదీశా॥నారా॥

రూపకతాళము.

నారసింహ్మనిన్ను వెరనమ్మినానన్నేలరా
గోరపాపములను - దొలగించుముక్రపాకరా॥నారా॥
పన్నగశయననాతో - వంతమేలబ్రోవరా-నన్ను
కన్నతండ్రీనీవె కరుణించు శ్రీమనోహరా నారా॥
నారదసుకాంగదుల్ - నుతించెదుపరాత్పరా
నేరములుంచకునాపై - నిర్మలాత్మకావరా నారా॥
కందర్పజనకనీ -కన్నావేరేదిక్కేదిరానా
మందబుద్ధులకూన్ప - మహానుభావనీవేరా॥ నారా॥
ఘటికాద్రివరనిలయ- గంభీరశుభాకరా
యెటుతాళుష్మక్రెన్నన- కుటిలముబోగొట్టరా॥నారా॥

రూపకతాళము.

నిన్నువినా-వేరే దిక్కెవ్వరున్నారురా
నన్నుబ్రోవదేమియిది న్యాయమాకృపజూడరా॥నిన్ను॥
పన్నగశయనని - పాలిటజేరినానురా
అన్యమునెంచబోకు- అయ్యాయిక్కార్యములేదురా॥నిన్ను॥

సనకసనందనాది - వందితుండునీవురా
కనకాంబరధర - కరుణించుశరణంటిరా నిన్ను॥
చోళసింహ్మపురనివాస సుందరనరసింహ్మారా
కాళకాలనెదుటవచ్చి - తప్పకరక్షించురా నిన్ను॥

ఆది తాళము—పల్లవి.

కలకంటినే నేడు నే- కలకంటినే నేడు కల॥

అనుపల్లవి.

కరిగిరివరదుడు యెదురుగవచ్చినట్లు కల॥

చరణములు.

చతుర్భుజములు-శంఖుచక్రములతో నాకు
సుదర్శనమై కరుణించి-బ్రోచినట్లు కల॥
కనకాంభరధర- కౌస్తుభాభరణు నా
జననమరణసంచిత- మెడబాపినట్లు కల॥
సకలలోకములను- తనగర్భమందుంచిన
అఖిలలోకనాయకు- డాదరించినట్లు కల॥
ఘటికాద్రిపురనివాస - న్రుసింహుడు
ఇటువగనుభక్తుని- హృదయమందు నిల్చ కల॥

ఆది తాళము— పల్లవి.

బృందావనలోలుడే-శ్రీహరి-బృందావనలోలుడే॥ బృం॥

అనుపల్లవి.

నా - మందహాసినిమోము - సుందరాంగుడే- బృందా॥

చరణములు.

గంధర్వకిన్నర - కింపురుషాదులెల్ల
వందనములతో స్తుతియించు శ్రీనివాసుడౌ బృందా॥
ప్రహ్లాదనారదాది రుక్మాంగదుల్
పొగడుచునుండెడి - వరవాసుదేవుడౌ బృందా॥
సంచితముల నెల్ల - సాగగొట్టి పుటములో
ద్రుంచివేయుఘటికాద్రినివాసుడే బృందా॥

కాపిరాగము - అటతాళము.

నారసింహ్మ నళినదళాక్షా
నమ్మితినిన్ను నే జలజాక్షా నార॥
ఘోరపాపములను దొలగించు
వారధీబంధనా కరుణించు నార॥
పార్థసారది -నీ- పాలజేరితి
ఆర్తరక్షక నీవేనునాగతి నార॥
కామక్రోధములో జిక్కి-చాలా
పామరుడైతి పాలించున్నపాలా నార॥
సుందరాంగా - సుభమంగళాంగా
వందనముభవభంగ శ్రీరంగా నార॥
ధరలో ఘటికాద్రినివాసా
వరమొసగుమిది వేళజెగధీశా నార॥

క్వాల్ రాగము రూపకం—పల్లవి.

పార్థసారథి నీపదమునమ్మితి పార్థ॥

అనుపల్లవి.

శ్రద్ధనీకిటి వనుకావునమ్మితి
శూరావీరా - ధీరాగాంభీర పార్థ॥

చరణములు.

కరుణాపయోనిధి - కరుగదునీమది
వరమునిహృన్నిధి - వరసుగుణాంబుధి
వాసాధీశా బాసవాహ పార్థ॥
సుందరరూపవతి - సుగుణామృతవల్లవతి
వందితదాశరథీ - వాసుదేవసురేంద్రనుతి
వాదానాదికాబా దయరాదాంఘునాథా పార్థ॥
ఘటికాచలపతి - ఘనుడైనధీమతి
యిటురావేనాపతి కుటిలాత్ముడనైతి
యీశాపాపవినాశ సర్వేశ పార్థ॥

బ్యాక్ రాగము - ఆదితాళము — పల్లవి.

వసుదేవాత్మజ - వాసుదేవా వసు॥

అనుపల్లవి.

మసలుచున్నారా - నా - దెసనుజూడరా వసు॥

చరణములు.

నందకుమారా - నవనీతచోరా
వందనమిదెరా - వరమొసగరా వసు॥
సుందరపాదా - సుగుణవినోదా
అందరిలోపేదా - ఆదరించరాదా వసు॥

ఘటికాద్రీవర - ఘోటకాళుదురా
భటునినేలర కుటిలవిదూర  వసు॥

ఆదిపల్లవి-హిందూస్థాని.

నారసింహ్మయేరా - నన్ను బ్రోవరారా  నార॥

అనుపల్లవి.

వరాముఖమేరా - ఖరిమాలినారధీరా  నార॥

చరణములు.

సుందరగంభీరా - సుగుణవ్రియ్యారా
వంతనమీదేరా - వచ్చినన్నేలరదొర  నార॥
బాలానమ్మితిరా - సౌఖ్యములివ్వరా
కాళాజాలనురా - బాలునికావురావిరా  నార॥
నామాత్మ్రతమీరా - నేమమొసగరా
పామరుడైతిరా - శ్రీమనోహరాకారా  నార॥
చోళసింహ్మపుర - మేలెడిమద్వర
భారీగొన్నానురా - నీలోవాడాదుగగదర  నార॥

జెశికతోడిరాగము - రూపకం—పల్లవి.

నిన్ను నెరనమ్మినారా - నన్ను బ్రోవనదేరా॥  నిన్ను॥

అనుపల్లవి.

పన్నగశయనధీరా - కన్నులకృపజూడరా  నిన్ను॥

చరణం.

అన్యుడనితలచకురా - అన్నా [illegible]
కన్నతండ్రినీవేరా - నన్నా[illegible]రా  నిన్ను॥

చిన్నబుద్ధివాడనురా - మన్నించిరక్షించరా
నన్నుకాంగగంభీర -నీ- కన్నా యెవరున్నారురా॥ నిన్ను॥
స్వర్ణఘటికాద్రీవర - ధన్యుడై ననాధోర
క్రన్న నకరుణించరా - విన్నపము జేసేనురా నిన్ను॥

ఆదితాళము-బ్యాకడరాగము-పల్లవి.

నమ్మితిఘటికాద్రిపతినిన్ను - నా - నమ్మితి॥

అనుపల్లవి.

ఇమ్మహిలోమదిని - నమ్మతిగాను నే నమ్మితి॥

చరణములు.

వాసుదేవ మాధవాముకారి
కేశవరాఘవకృప - జూడుము నరహరినే నమ్మితి॥
దుర్మతినహింకా - రాదులవలనునీ
మర్మముదెలియకను - కర్మముజెందితిల్లనే ॥ నమ్మితి॥
ఘోళసింహ్మాపుర - నివాసన్నసింహ్మానే
తాళజాలనీవేళ - తప్పక బ్రోవుము - నే - నమ్మితి॥

ఆదితాళము—పల్లవి.

రావేరా - రఘువీరా ॥ రా॥

అనుపల్లవి.

కావరా కరుణాకరగాంభీరా రా॥

చరణములు.

సుందరా - శుభాకరా
[illegible] - నన్నేలరధీరా రా॥

శ్రీధరా - సుగుణాకరా
ఆధారామెవరురక్షింవేగరా రా॥
నాధార - నీవేనురా
నరకేసరా కారాగావర రా॥

ఆదితాళము - పల్లవి.

నను బ్రోవరాదా - నాతోనీకువాదా నను॥

అనుపల్లవి.

వినుభువిమీద - వేరెవరుదిక్కున్నారురనాధ। నను॥

చరణములు.

పన్నగశయన - పతితపావన
కన్నులజూచినీ-కరుణవుంచుమిది తరుణపహాను॥ నను॥
నీరజనయనా - నిఖిలపోషణా
కరినిగాచిన కరివరద రాజనాదారవుగాన నను॥
నరకేసరినా - గురుడునీవేను
దురితముమాన్పి-త్వరగలోగావు మురహరి నరహరి॥ నను॥

తోడిరాగము - ఆది—పల్లవి.

రాదానామీద్యా - దయరాదానామీద రాదా॥

అనుపల్లవి.

ప్రాణనాదాసీతసమేత - వాదాయిఖ రాదా॥

చరణములు.

ఆధారమునీవని - పాదాంబుజములను
శ్రీదరావమ్మితి - పద. బోదానానునకావ రాదా॥

యధార్థముగనిను - మదిఁ దలచినే
సదాబజించెదను - శుదర్శనమై బ్రోవ రాదా॥
వేద వోక్యఘటి - శాద్రినాధానను
శోధించుటమరి - యాధమాధవకృప రాదా॥

ఆదితాళము- సురటిరాగము-పల్లవి.

రామానను బ్రోవుమా - శ్రీ రామానను బ్రోవుమా శ్రీ॥

అనుపల్లవి.

వామాజగదభి - రామాసద్గుణ
స్తోమా పరాంకుశనామా దశరధ- శ్రీ॥

చరణములు.

కామాదులచే - నేమాదులువిడచి
యేమారితిపరం - ధామాపట్టాభిరఘు రా॥
సీతాసమేతసద్ - బోదాసురార్చిత
పాధాభక్తప్రియుడు - శాదాకల్యాణగుణ రా॥
యీశొఘటిశాద్రిని - వాసాదాసాదుల
పోషాభవభంధవి - నాసానరహరి .. రా॥

బ్యాక్ రాగము- ఆదితాళము-పల్లవి.

శరశింపనిన్ను నమ్మినారా శర॥

అనుపల్లవి.

నిన్ను నమ్మినారా-నన్ను బ్రోవదేరా ధీరా॥ శర॥

చరణములు.

శరమదశాకర - శరణంటినిరా

కరుణవుంచవేమిరా - తరుణమిదేరా - వర - నర॥
శ్రీధరదామోదరా - యాధరయందురా
ఆదరించరావేరా - ఆభారాశనకాంభర - ధర- నర॥
శంఖుచక్రధరా - చాలనమ్మియున్నారా
సంకటంబుమాన్పరా - పంకజదళనేత్ర - దొర॥ నర॥
చోళసింహ్మపుర - మేలుకృపాకరా
తాళజాలనుర - పాలించురసుందర వర॥

## అటతాళము - పల్లవి.

నమ్మినవాడను-నేను-నిన్ను-నమ్మినవాడను-నేను

## అనుపల్లవి.

ఇమ్మహిలోమదిని - సమ్మతిగాను నమ్మి॥

## చరణములు.

చరణారవిందముఖుందా-నీ- శరణుజొచ్చితినినచ్చితానందా - కరుణించుగోపికానందా - యిది - తరుణముకావరా - సూదగోవిందా నమ్మి॥

సుందరరఘువీరానాదా - నా - బాధముతెరటార్పమానందబోధా- వందనమురజగన్నాదా నాముందువచ్చికన్నైనా - పాలించరాదా వర॥

పరమదయాకరరంగా - నాతరముకాదు త్రోవజూపువత్సంగా - మురవరుసూతభవభంగా నన్ను అరమరజేయకురాయోగనరసింగా నమ్మి॥

రూపకతాళము - దర్బార్ రాగము - పల్లవి.

పుండరీకాక్షా - పరంధామా పుండ॥

అనుపల్లవి.

దండముదశావతారా - అండజేరిశిని కావరా॥ పుండ॥

చరణములు.

చండప్రచండకో-దండముచేబట్టు సమరభీమా ఆ దం
డధరునినాయండజేరకుండా జేయుము భక్తకామా-అండ
ద్వయభువికేశా - ఆదరించుర సర్వేశా పండరి పురిజగ
దీశా భక్తునిబ్రోవుముయీశా పుండ॥

చరణారవిందముచుముకుంద- గోవిందా సచ్చితానందా
నీశరణుజొచ్చితిని కరుణవుంచు మది శరణము రామ
చంద్రా- సాకేతపురములోనదా- ధన్యుడవైయుండలేదా
లోకేశుడునీవేగదా - శీఘ్రముపాలించరాదా పుండ॥

శ్రీధరదామోధరా నామీదేలవాదురా - సరికాదుర
యిఖమీదుర దయజూడుము గదరా కాళింగనిర్ధనధీరా
ఘటికాద్రినివాసవరా తాళజాలనుర వేగరా తనయుని
నేలరరఘువరా పుండ॥

తోడిరాగము - రూపకతాళము - పల్లవి.

పురుషోత్తమనను బ్రోవు -
సంపూజ్యనామా - భక్తకామా॥ పుక॥

అనుపల్లవి.

శరణాగతి - యస్ప్రమొక్కితి

సమయము కావర రఘుపతి
నిమిషము వ్రార్వను శ్రీపతి ॥ పుర॥

చరణములు.

కరుణాకర గాంభీరా - తరుణముసంపన్న ధీరా
వరుణుని బ్రోచినవీరా వారిధిశయన కృపాకరా
వేరుదిక్కెవరున్నదురా పుర॥
వేద వేదాంతబోదా - శ్రీధరా రక్షించరాధా
పాతకుడవనినామీదా పగబూనుటమరియూదా
పాలించురసద్బోదా పురు॥
ఘటికాచలగిరివాసా - కుశలము
బోగొట్టుమీశా - వరపత్రశయనవుల్లాసా
వైదేహీమనోన వైకుంఠపరమేశా పురు॥

రూపకం-పల్లవి.

యీవేళ బ్రోవరా - రఘువీర-యీవేళ బ్రోవరా యీ॥

అనుపల్లవి.

నీవేఘటియని కుదిని-నిజముగ నేనమ్మితి॥ నీ॥

చరణములు.

తాపత్రయములులోబడి - ఆపదజెందితి - నేచెడి
శ్రీపద్మనాభానీ తిరువడి - జూపుము
యిపుడెకృపతోడ నీ॥
కామక్రోధాదులవల - నేమమువదలితి నేచాల
పామరుడైతిరాధాలోల్ల-యేమందురకరుణాలవాల॥ యీ॥

శ్రీధరఘటికాద్రీవర - అధరవదిశ్రీముక్తిదనిర
యీధరలో నాముందర - పీదయలేక నెట్లోర్తుర॥ యీ॥

ఆదిపల్లవి.

రారారామచంద్రా - రక్షించవేగ రారా॥

అనుపల్లవి.

ధీరాదశరధకుమారారణరంగ
శూరాకరుణాకర - గాంభీరాతరుణమీదె॥ రారా॥

చరణములు.

సీతాసమేతసతీ - బోదాపట్టాభిరఘు
నాధానామీదదయ - లేదాననుపాలించ॥ రారా॥

వామావైకుంఠపరం - ధామాదశావతార
నామానళినాక్షశ్రీ - రామానాపాలిటి రారా॥

వాసాచోళసింహ్మపు - రీశాభవభంధవి
నాసానరహరిజేగ - ధీశాదాసునిబ్రోవ రారా॥

కమాసిరాగము - ఆది-పల్లవి.

కావరాఘటికాద్రివుణివాసా - కరుణాకటాక్షా కావ॥

అనుపల్లవి.

కావతాతరుణమురరిపు - ఘటిసీవేరాగాంభీరా
శ్రీవరరఘువీర - చిత్తగించియువేగరా కావ॥

చరణములు.

చాలాప్రహ్లాదునినీవు - మేలిమితోగాచినావు
యాలనామొరవినవు - ఆలకించనురావు రావాదే

వాదిదేవా రక్షించుమహానుభావా కా॥
శ్రీధరధామోధరా - నీవాడరనన్నేలరా
 అధర వెవరురా - అంభుజధళనేత్రా నేత్రాఅభయ
పాత్రా నిర్మలజనస్తోత్రా కావ॥
నారసింహ్మయ్యనినిన్ను - సారెసారెకుగోరతు
 నేరముమాన్పికను- నిమిషముప్రొర్వలేను లేను నీపా
దమునమ్మి నానురాయీభువిలోను కావ॥

బ్యాక్ - రూపకం.

వంజనేవిఅనరిప్పాయి- వాంచలింగేశా హానోర్గళ్ నేసా.
నారసింహ్మనన్నుబ్రోవు - నమ్మినానురా
 నమ్మినానురా - నాఉరవినవేరా నార॥
శ్రీధర దామోధర - నీచిత్తముంచరా
 చిత్తముంచరా - చిరుతినుబ్రోవరా నార॥
అధరవనిమొక్కితినిరా - అలకించరా
 అలకించరా - అమృతవల్లీశ్వరా నార॥
ప్రహ్లాదునిగాచిన - భక్తవత్సలయిటురా.
 భక్తవత్సలయిటురా- పరవాసుదేవరా నార॥
చోళసింహ్మపురిలో వెలయు - సుందరాకారా
 సుంధరాకారా - సుఖములివ్వారా

తోడిరాగము - రూపకం-పల్లవి.

నారసింహ్మస్వామీ-నన్నుబ్రోవదేమి రామి॥ నార॥

అనుపల్లవి

భారామానన్నేలుమీ-పరమకల్యాణపరాకేమీ॥ నార॥

చరణము.

కరుణనుంచవేమీ - కటాక్షించుమంతర్యామి
తరుణము చేవిడకుమీ-దాసుడేనుదయనేలుకోమీ॥నార॥

జన్మమె త్రితిభూమీ - జలజాక్షానాధారసామి
కర్మముబోగొట్టుమీ-గాంభీర్యమునకృపజూడవేమి నార॥

యేకశ్శిలపర్వతిమీ - దేలికై వెగ్గెడిసామి
పాకారినుతమా - మీ-పాదములిపుడేజూపుమీ ॥నార॥

క్వాల్ రాగము-ఇంగ్లీషుమెట్టు-ఆది-పల్లవి.

నన్ను బ్రోవదేమిరా - నాగశేయనవేగరా.

అనుపల్లవి.

నిన్ను నమ్మినానురా-నీకన్నా యెవరున్నారురా॥ నన్ను॥

చరణములు.

శ్రీధరదామోదరా - వాదుచేయతగదురా
బీదయందేలక్రోధరా-ఆధరించుప్రాణాధారా॥ నన్ను॥

బాలునేనీవాడరా - పరమానందదయాకరా
చాలుకష్టముదూస్పరా-సర్వలోకశరణ్యరారా॥ నన్ను॥

చోళసింహ్మపురీశ్వరా - సుందరకరుణాకరా
తాళజాలకావరా - తప్పులన్ని క్షమించరా॥ నన్ను॥

జంజూటిరాగము - ఆదితాళము.

చరణములు.

నారసింహ్మాయనినేను - పిలచితెనాతోపలుకవేమి
వేరుదిక్కేవరున్నారునా -
యెదురుగవెసలిరాతాపామి నార॥

నందనందనగోవిందముకుందా - బృందావనలోలా
వందనమురశ్రీసుందరాంగవను - దేవదేవకీబాల॥ నార॥

యెన్నివిధంబులు వర్ణనజేయుదు - కన్నతండ్రిరారా
చిన్నబుద్ధివాడను-అన్నితప్పులున్ను మన్నించిరక్షించరా॥

వరాకేలశ్రీధరాదామోధరా - భక్తునిబ్రోవదేరా
శురేంద్రవందిత-వరాహావతారా-సుధాకరముధీరా॥ నార॥

చోళసింహ్మపురినేలుమురహరి - సుతునికావరశౌరి
బాళిగొన్నానురతాళజాలనుర-పాలించురనరహరి॥ నార॥

జంజూటిరాగము - ఆదితాళము.

నారసింహ్మనీనళినపదంబులు - యాలజూపరావు
దరధరధరకుమారకృపాకర-చిరుతనిపుడుబ్రోవు॥ నార॥

బాలుప్రహ్లాదునియా - నేలకరుణవుంచిబాలబ్రోవలేదా
మాలమనివకరిరాజునిగాచివమురహరినీవెగదా నార॥

పంచపాండవులభార్యమొరవిని - పాలించినస్వామి
పంచాయుధధరవాసుదేవ-పరమాత్ముడనాస్వామి॥ నార॥

కారుణ్యాకర- కౌస్తుభాభరణకాళింగనాటవవీరా
నీరజనయననీ-కరణుజొచ్చితిని-నిమిష మూర్వలేరా నార॥

శ్రీధరధామోధరా - నాయందునీచిత్తముంచవేరా
బీదయందువాదేలర-రఘువర ప్రసన్నముగరారా నార॥
చోళసింహ్మపురనేలుదయానిధి - సుజనామృతవల్లీ
శా వేళయిఁకే-నే-తాళజాలనుర వెడలుజెగధీశా నార॥

ఏకతాళము-పల్లవి.

నిన్నునమ్మినాను - నీరజనయనా నిన్ను॥

అనుపల్లవి.

నన్నుబ్రోవదేరా - నారశింహ్మధీర వీర నిన్ను॥

చరణములు.

పన్నగశయనా - పతితపావన
విన్నవించెదను - నిన్నేకోరెదనునేను నిన్ను॥
కరుణాకరనీ - శరణుజొచ్చితిని
తరుణముగాన - త్వరగనేలుగరుడగమన నిన్ను॥
ఘటికాద్రివాస - గాంభీర్యవుల్లాసా
ఘటికలోప్తవాస - పోషకసర్వేశయీశా నిన్ను॥

మధ్యమావతిరాగము-ఆదితాళము-పల్లవి.

కంచివరదునిసేవించుడీ - జనులారామీరు కంచి॥

అనుపల్లవి.

మంచివేళమరినెంచి ఆశ్రయించి
సంచితప్రారబ్ధములనుద్రుంచెడి కంచి॥

చరణములు.

గరుడగమనరాజభోగి - కారుణ్యత్యాగి

శరణుజొచ్చినవారణము మొరవిని ఆ
తరుణముమకరిని - ద్రుంచిరక్షించిన కంచి॥
చింతలెల్లనుబోగొట్టును - జగద్విరాట్టును
అంతర్ముఖమున - నిరంతరముగ నుతియింపుచుదేవుని
పంతముతో జేరి కంచి॥
దాసదాసులబ్రోవుజగదీను - ఘటికాద్రినివాసు
పాశబంధముల - నాసముజేయుశ్రీని
వాసమూర్తిని - ర్ధోషచిత్తుడని కంచి॥

నాధనామక్రియరాగము - అటతాళము-పల్లవి.

నరసింహ్మనినునమ్మి నారా లక్ష్మి
నరసింహ్మనినునమ్మినారా నర॥

అనుపల్లవి.

ధరలోఘటికాద్రినివాసా - నా తరముకాదు
బ్రోవజూవుజెగదీశా నర॥

చరణములు.

పరమపురుషా పాండురంగా - నన్ను పాలించిరక్షించరా
భవభంగా - యిదితరుణమురారా సత్సంగా-యిక తామ
సము జేయ - తగదుసుభాంగా నర॥
అమృతవల్లి తల్లిసమేత- నన్నుఆదరించరా తామసగుణా
తీతా బ్రహ్మరుద్రాదివినుతా - యీబీదయందు దయ
లేదాసద్బోదా నర॥
వేదచోద్యరఘునాథా- నీపాదమునమ్మితిరా-జగన్నాదా

శ్రీధరానామోదవాదా - నరకాదుర నీకుఘూంభీర్యావి
నోదా నర॥

ఆదితాళము- పల్లవి.

దేవాదిదేవానను - శ్రీఘనుకావరావా॥ దేవా॥

అనుపల్లవి.

నీవాడనౌదునేనదా - నిన్నునమ్మినానుగదా॥ దేవా॥

చరణములు.

పామరములో జిక్కి - బండబడిచాలాచొక్కి
ప్రేమతోనిన్ను మ్రొక్కి - బీదయుందు
పక్షిరయొక్క దేవా॥

కరిరాజు మొరవిని - ఖండించమకరిని
నరగునచక్రమున - సంహ్మారించిగాచిన॥ దేవా॥

ధరనుఘటికాద్రివాసా - దయయుంచరానర్వేశా
సురనుతిజగదీశా - సుందరనారసింహ్మానా॥ దేవా॥

రూపకతాళము-పల్లవి.

కరుణించరారా-రఘువీరా-కన్నతండ్రివినీవేరా ॥కరు॥

అనుపల్లవి.

తరుణమనిశరణుజొచ్చితి - తక్షణము రక్షించపక్షివా
హానుడై కరు॥

చరణములు.

వేదవేదాంతవేద్యుడై - నఖిలజనులరక్షకుడై
సాధుసజ్జనహితుడై- సంపూర్ణకరాక్షవీక్షణ్యుడై॥ కరు॥

తుంబురునారదాదిస్తుతింపగ - శృతివీణసంగీతము మెరయ
గసంభ్రమముతోడ లక్ష్మీసమేతుగ - తనయునికివేళ యెదు
రుగ కరు॥
చోళసింహపురిలోనివాసా - సుందరలక్ష్మీ మనోల్లాసా
తాళజాలనుర జగదీశా - దాసుని బ్రోవరారాభవనాశా
కరుణించరారా॥

ఆదితాళము - పల్లవి.

లక్ష్మీనృసింహా - నమ్మితిబ్రోవుమా లక్ష్మీ॥

అనుపల్లవి.

పక్షముతోనన్ను - పాలించరాప్రేమా॥ లక్ష్మీ॥

చరణములు.

సౌందర్యనాదా - శుభగుణబోదా
వందనముజేసెదా - వైకుంఠవినోదా లక్ష్మీ॥
బాలుప్రహ్లాదుని - బ్రోచినవాడని
చాలానేనమ్మితిని - సౌఖ్యములిమ్మని లక్ష్మీ॥
ఘటికాద్రిలోనివాసా - గాంభీర్యవుల్లాసా
కుటిలముమాన్పుమీశా - గోపికాహృద్విలాసా॥ లక్ష్మీ॥

ఆదితాళము - పల్లవి.

నారాయణనినునమ్మితి- నను బ్రోవరా శ్రీయఃపతి నా॥

అనుపల్లవి.

పారాయణముచేయుభక్తులను
పక్షముతోను - రక్షించను శ్రీమన్ నార॥

చరణములు.

కరుణాకరా - శరణంటినిరా
తరుణమవునురా తనయునినేలరా నార॥
సనకసనంద - నారదాదులను
దినముబాగడు - దీనదయానిధే నార॥
ఘటికాద్రియందు - వెలయునృసింహస్వా
భటునిగాపనీ - పాదమెఘుతి శ్రీమన్ నార॥

ఆది-పల్లవి.

ఆనందంబ్రహ్మానందం - గోవిందంభజగోవిందం

అనుపల్లవి.

ఆనందగురుడగు - అనంతశైనుని సం
జ్ఞానముతో - భజియించెడివారికి ఆనం॥

చరణములు.

లోకనష్టులులేన - పోక తెలుసుకొని
లోకేసునినుతి - యించెడివారికి .. ఆనం॥
సనకసనందన - సజ్జనులందరు
దినముబాగడుదేవుని - గొలుచువారికి ఆనం॥
ఘటికాద్రిపురనివాస- నృసింహస్వామిని
ఘడియఘడియకు - స్మరణించినవారికి ఆనం॥

ఆదితాళము-పల్లవి.

పాలింటరా శ్రీమన్నారాయణా నా

అనుపల్లవి.

యీ- బాలుని బ్రోవుర వేదనారాయణా నా

చరణములు.

ఆలుబిడ్డలను అన్నతమ్ములను- జాలమైనసంపదలెల్లను
చాలమరియుకలిగిన నేమిఫలమురాదుర-
నాకోక త్రోవజూపను పాలి॥
ధనకనకవస్తువాహనములుండినను
ధరనునరాధిపుడను పేరొత్తినను
ఘనమైననీపాదాంబుజములను
స్మరణచేయనినరుడేలనీభువిని పాలి॥
సనకసనందన - సనత్కుమారులు
సకలమునులునీచరితులను దినముప్రగడఘటికాదిని
వాసా తల్లియమ్మ తవల్లమ్మసమేతుడై పాలి॥

ఆదితాళము-పల్లవి.

నారాయణనను బ్రోవరా నారా॥

అనుపల్లవి.

నారాయణనీ - నామస్మరణము
పారాయణము - జేయుభక్తుడను నారా॥

చరణములు.

కరుణాకరా నీ - శరణుజొచ్చితిని
వరమొసగను - వచ్చియెదురుగ నారా॥
బాలుప్రహ్లాదుని పాలించినదేవా

తాళజాలను నేను - దయతోయీవేళ నారా॥
ధరలోఘటికాద్రి - చలశ్రీలక్ష్మీసా
పరమదయానిధా - భవబంధవినాసా॥ నారా॥

రూపకతాళము-పల్లవి.

వెంకటేశ్వరానిను వేడితి - జగధీశ్వరా శ్రీ వెంక॥

అనుపల్లవి.

సంకటంబులనుమాన్పి - సౌఖ్యములివ్వను రారా॥ వెంక॥

చరణములు.

హరినామదివ్యపారాయణులు
నరశిజభవసజ్జనావళులు
నిరతమునిచుబాగదుఃభక్తుల
నేరములను తీర్చ్చ - ఘనుడా వెంక॥
అఖిలలోకములలోనుండు
సకలజనులందరునీకు
నిఖిలలోకగాయకుడనని
సకల కానుకల చెల్లింతురుగా వెంక॥
ధరనుఘటికాద్రినిలయు తనయునిగాపుముసదయా
పరమఃలానగుమప్రమేయవాసవార్చితా- భయ॥ వెంక॥

ఆదితాళము.

శ్రీరామా శ్రీరామా - సీతాసమేతరామా
వారిజాక్షరామా - వైకుంఠాధిపరామా శ్రీ॥
కారుణ్యకరరామా - కౌశల్యానుగుణరామా

మాయతిసమేత రామా - మంగళాకర రామా శ్రీ॥
అనన్యాశ్రయరఘురామా - ఆదరించుమహరిరామా
శరణాగత రక్షక రామా - జానకీపతేరామా శ్రీ॥
దశకంఠఖండన రామా - తాటకీమర్దనరామా
శచిపతినుతిరామా - సౌందర్యకల్యాణరామా శ్రీ॥
ఘటికాద్రిగిరిరామా - ఘనదానవహరిరామా
వరభద్రశైలరామా - వైరివిదూరుడరామా శ్రీ॥

శ్రీకృష్ణస్వామిపేరున గొబ్బిపాట.

గొబ్బియళ్లో - గొబ్బిగొబ్బియని వేణుగోపాలుని
పాగడరే గొ॥
,, దుష్టులనుశిక్షించను-కృష్ణుడుఅవతరించె గొ॥
,, నందగోపాలునిభార్య-నాయకికడుపులోనే॥ గొ॥
,, శంఖుచక్రములంతోడ-స్వామిపుద్భవమయ్యెనే॥
,, రేపల్లెయశోదవద్ద-రాత్రిలోనేమారెనపుడే॥ గొ॥
,, కంసునికిరాతిసిని - కన్నుబెదరజేసెనట గొ॥
,, కాకిటవృక్షములనకు-వాసుదేవునికట్టినటనే॥ గొ॥
,, కట్టినమానులురెండు-కవ్వలింపదొల్లించెనే గొ॥
,, దొల్లినమానులురెండు-దేవతులై మ్రొక్కెనట॥
,, దేవతలునిశాపగాన్ని-దైవలోకంజేరిరటా॥ గొ॥
,, గోపాలబాలురతోడ-గోవులనుమేపెనట॥ గొ॥
,, వేణునాథంబుబట్టి-వేణుగోపాలూదెనట గొ॥
,, కాళింగమడుగులోన-కాళింగునిబట్టుకొని గొ॥

,, కాళింగునిగర్వమణచి-కళంకమైనిగ్రహంచేశె॥గో

,, దూడలనువిప్పిదోలి-దొంగలించిపాలుతాగె॥గో

,, వుట్టిమీదనున్నపెరుగు - కట్టితోనుతాగినాడె॥

,, గోవర్ధనగిరియెత్తి - గోవులబాలులగాచె గో॥

,, శకటమైవచ్చినసురుని-సంహారించివేశినాడు॥గో॥

,, చక్రమునుపంపిజరా - సంధునినిజంపినాడే॥గో॥

,, గోపికలున్నీళ్ళాడగా-కోరిఅచ్చటపోయినాడు॥గో॥

,, చీరలంతాయెత్తియూను-సిఖరమునతగిలించెనే॥

,, స్త్రీలందరువెదికిచూడ-చిన్నికృష్ణుడుమానిలుండ

,, మానిమీదనుండుస్వామిని-మానముపోయినదని

,, వేడుకొనిమొరబెట్టగా -వేణునాథుడేమన్నాడు॥

,, చేతులురెండెత్తినన్నా- శిరముపైమ్రొక్కితేనే॥

,, చీరలుయిస్తున్నానని-శ్రీమాధవుజెప్పెనట॥గో॥

,, గోపికలచీరలెల్లా- దాపిమోసముచేశెనే గో॥

,, వున్నొక్కొక్క గోపికలకు - వున్నొక్కొక్కకృష్ణ
డాయనే .. గో॥

,, కాళింగమడుగులోన-కలశిక్రీడచేశెనట గో॥

,, అష్టభార్యలున్ను పది-ఆరువేలగోపికలు గో॥

,, ఇష్టమైనట్టువార్లకు-యేకమైసంభోగముచేశె॥గో

,, కంసునిగర్వమణచి-కాలునికొప్పగించె గో॥

,, ద్వారకాపురములోన - దంపతులై యుండి
నాడు గో॥

,, అస్తినాపురములోన-అరమనలు అడిగెనే గో||
,, విదురుదమందిరం యిదే-మీయిల్లని చెప్పెనటో||
,, అచ్యుతనంతోషముగా-అన్నభోజనంబుచేసె||గో
,, పాండవులకు సంగతుల్ పలికి బోధించెనటో||గో||
,, అర్జునునకు సారథ్యం-అచ్యుతనందుండెను||గో||
,, పాండవులనుముందు పెట్టి-పగవారలసంహరించె||
,, ధర్మరాజు పట్టాభు-ధరియించి నేలుచుండె గో||
,, పాంచాలమ్మ సభ్భంబు - భగవంతుడు ముగించెను||
,, ధరలో ఘటికాద్రినివాసు-దేవనృసింహస్వామి||
,, దాసులకోరికలను- తప్పకయిచ్చిరక్షించె గో||

మంగళము-రూపక తాళము.

జయమంగళము - నిత్య-శుభమంగళం రామా|| జయ||
రామునకు లక్ష్మణునకు - భరతశత్రుఘ్నులకు - ధీమణి
సంజీవిరాయదివ్యాంగునకు జయ||
ఆపద్బాంధవునకు - యఖిలజనావనునకు
శ్రీపద్మనాభునకు - జయరఘునాయకునకు|| జయ||
జానకీసమేతునకు - జగదభిరామునకు
దానవసంహారునకు - దశరథతనయునకు జయ||
లక్ష్మీనృసింహస్వామి వల్లీనునకు
పక్షివాహనవిష్ణు - పరమాత్మునకు జయ||
ఘటికాద్రినిలయునకు - ఘనభుజగశయనునకు
వరనారదసునారద - తుంబురలకీప్రుడు జయ||

నలువనుగనినదొరకు - నళినా ప్తకులజునకు
కలుములనతిబాగడు - కమలాక్షునకు జయ॥

లాలి

శ్రీరామచంద్రలాలి - శ్రీహరి సీతాసమేతలాలి
వారిధిశయన లాలి - జెయవినుత -
వైకుంఠవాసలాలి॥ శ్రీ॥

ఆదిమూలమె అనిన కరిరాజు - కళయంబుతో గాచిన
వేద వేదాంతవినుత-కరివరద-రాజభోగేంద్రలాలి శ్రీ॥

మత్స్యకూర్మవరాహ నారి-వటు రామ- రామ రామా
అచ్యుతకలికతోడ - దశనామ - అవతా
రమూర్తిలాలి శ్రీ॥

నవనీత చోరలాలి - శ్రీరంగ - నాగేంద్రశయనలాలి
భవబంధ వినాశలాలి - పరంధామ-
పరమకల్యాణలాలి॥ శ్రీ॥

లక్ష్మీనృసింహలాలి - వరవాస - లోకేశనాధలాలి
వటుముసభ. క్తజనుల-కరుణతో పాలించు భవ్యలాలి॥ శ్రీ॥

ఘటికాద్రినిలయులాలి - ఘనతర - కౌస్తుభాభరణలాలి
వటపత్రశయనలాలి - వసుదేవ-దేవకీతనయలాలి॥ శ్రీ॥



## హెచ్చరిక.

హరి హెూంనమో నారాయణా అఖిలజగన్మోహనా
పరిపూర్ణకళాత్మ పరంధామా హెచ్చరిక హ॥

సనకసనందాదుల్ నారదరుద్రాంగదులుగ
దినమునినుపొగడు దేవదేవా హెచ్చరిక హ॥

మత్స్యకూర్మవరాహహరి । వామనరామరామా
అచ్యుతజార్ధకావతారా హెచ్చరిక హ॥

ఆదిమూలమనినకరి - రాజును గాచిన
వేదవేదాంతాకరి - వరదా హెచ్చరిక హ॥

చోళసింహపురీశా - సుందరలక్ష్మీసా
ఈ - వేళను బ్రోవు - జగధీశా హెచ్చరిక హ॥